# పీఠిక.

—:o:—

ఈచిన్ని పొత్తమునకును మిగిలిన తెనుఁగు కబ్బములకును జాలవ్యత్యాసము గలదు. ఈకథ నాయికావియోగాలాపములతోఁ బ్రారంభమై నాయికానాయకుల పరస్పర సంయోగముతో విరమించుచున్నది. లలిత కథానాయిక. సత్యవర్ధనుఁడు నాయకుఁడు. నాయిక యొక రాచపడఁతుక. నాయకుఁడొక విద్యాప్రవీణుఁడు. వీర లిరువురు నొండొరులం బ్రేమించి పరిణయంబాడఁ గృతనిశ్చయులైరి; కాని కళ్యాణముమాత్రము జరిగినదికాదు. ఇట్లు కొంత కాలము గడచుటచే, సత్యవర్ధనుఁడును లలితామనోభినివేశ మెఱుంగ ననువుపడమి, నిరాశఁజెంది, వియోగాతురుఁడై, ప్రవాసమున కేగెను. లలితయు మనస్ఫూర్తిగ వలచినసత్యవర్ధనుండక్క యొండొకనిఁ బెండ్లియాడఁజాలక, మనోహరాన్వేషచిత్తయై, స్వగృహసుహృదాప్తబృందంబులఁ బెగనాడి, వనులజాడలఁబోయెను. కనా జనసౌశీల్యమును గాపాడుకొను తలంపున నీయువ తనసంచారసమయమందు బూరుషవేషము ధరించెను. వనులం దిరుగుచు, వియోగశోకంబునం దవిలి, దారిఁదప్పి యీకన్యామణి విలపించుటయు, నాచేరువ నున్న తాపసి సాదరంబున నాతిథ్యమొసఁగుటయు, సనోత్కృష్ట కుశల

ప్రస్తావనావశంబున నొండొరులం దెలిసికొనుటయుఁ గథాశేష పూర్వములుగ నిందువర్ణింపఁబడినవి.

ఈకథయందలి ప్రాముఖ్యాంశము లొక హూణక పుస్తకమునుండి గైకొనఁబడినవి. ఐనను జాలవఱకిందు స్వకల్పితము లెసంతరింపఁబడినవి. పురుషవేషధారిణి యగు నాయికకు బుంలింగవ్యవస్థలే వాడితిని.

ఇదియె నారచనాప్రయత్నమునఁ బ్రాథమిక మగుట భాషాభిమానులెల్ల రిందలి దోషములకు నన్ను మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు

సుధీవిధేయుఁడు,

రాయప్రోలు సుబ్బారావు.

ఓం

# లలిత.

ఉ. ఓ సుగుణాలవాల! కరు

ణోదధిపూర్ణశశాంక! చంద్రికా!

హాసవికాస! భాసురశు

భాంగ! కళాలసితాస్య! సంతతో

ల్లాస! నవీనయౌవనవి

లాస! తుషారవినిర్మలాత్మ! యా

హా! సఖ! నన్ను వీడఁ దగు

నా? యగునా? సుగుణాళికీగతుల్? 1

చ. నిను విడనాడి యొంటి మెయి

నిల్వఁగ లేక, భవద్వియోగ సం

జనితవిషాదవేదనల

సైపఁగఁజాలకఁ, జిత్తమూరటన్

గనమి విరాళిఁదూలి, నినుఁ

గాంచు సముంచితకౌతుకాప్తి, ని

న్వని కరుదెంచితిన్ స్వజన

వారము దూరము గాఁగ నెచ్చెలీ! 2

ఉ. నాటిన గాఢమోహమున
నాల్గు దినంబులనుండి యీమనోఘో
రాటవిలోనఁ ద్రిమ్మరితి
నంతము లేని నదీనదంబులన్
దాటితి, నందునందు భయ
దస్థితిఁ గాలిడరాని తావులం
దోటమి లేకయే తిరుగ
నొప్పితి ముప్పిరిఁగొన్న ప్రేముడిన్. 3

ఉ. తాలిమిఁదూలి, కన్నతలిఁ
దండ్రుల వీడి, వియోగవేదనన్
దేలి, హితాహితంబులఁ గ
ణింపక, పూవిలుకానికాఁకలన్
సోలి, వచింపఁజాలనిమ
నోభరముల్ భరియించి మాయఁగాఁ
జాలక, నిందువచ్చితిని
జాల మికేలర! యేలరా! చెలీ! 4

ఉ. హారము భారమై వనవి
హారసుమాపచయప్రమోదితా
చారము దూరమై మధుర
సాయనరుచ్యపదార్థకల్పితా,

హారము కారమై ననహి
మాంబుకదంబిత చందనాద్యలరే?
కారము నైరమై నెతల
గాసిలితిన్ నినుం బాసి నెచ్చెలీ! 12

గీ. చెలిమి నినుం గాంచి, మన్నించి, పలుకరించి,
మించి, హర్షాబ్ధి నోలలాడించు భాగ్య
మున్నదో? - దో? మునుముందు సన్నుతాంగ!
ధైర్యమా! చెన్నమాసె, మధ్యాహ్నమయ్యె. [illegible]

ఉ. ఎడనెడం బాఱుచుండు సెల
యేఱుల నెచ్చునీరుం ద్రావుచున్
బాడమిన కందమూలముల
భోజనవేళల నారగించుచున్,
గడయు మొదల్ గనంబడని
గాననభూమిం జరింతు నొంటినై
జడియక, దైన్య మొందక, న
సాధ్య మటంచుం దలంప కెంతయున్. [illegible]

చ. నడుమం గంజాల నింక, వద
నమ్మునం గ్రమ్మెను జెమ్మటల్, నినుం
బాడం గనమిన్ మనంబు ధృతిం
బూనకం జంచల మయ్యెం గన్నులన్

ఉ. నాటిన గాఢనిష్ప్రవారిక
జాలము జాల్కొనె; నిద్రలేమిచేఁ
గాత్రశిల; సంతసం బెడలె,
వ్రచ్చువిషాదము మేదురంబుగాన్. 8

ఉ. నాలుకయెండెడున్, మనము
నన్ ధృతితూలెడు, ముందువ్రావఁగాఁ
గాలుఁ గదల్పఁజాల, వడఁ
కన్ దొడఁగెన్ దను వెల్లఁద్రాఁగ నీ
ళ్లా! లభియింప విందు, బల
మా! గతమయ్యెను, గంటనశ్రులా!
కాలువ గట్టసాఁగె, రవి
కాంతుల కెంతయుఁ జిక్కసుక్కుటన్. 9

క. చివురుల కెనయగు నడుగులఁ
జివికినములు గ్రుచ్చుకొన్నఁ జివ్వనఁ బ్రాణం
బవిసెడు దిక్కరి సొక్కితి
శివశివ! భర మయ్యె బాధ చింతావశమై. 10

క. ఫలములుగానీ, చల్లని
జలములుగానీ, దొరకుటసాధ్యం బీదు
స్థలమున నాఁకలిదప్పులఁ
దొలఁగించెడు మార్గ మెయ్యదో? చెలికాఁడా! 11

ధవళరుచిరాన్నఘృతసారదధులు లేక
నిలువ నగుఁగాని, నిమిషంబు నిలువ ఁదరమె
త్రాగఁ రెడు నిర్మలోదకము లేక?
ప్రాణినైజంబు లతివిచిత్రములు గావె? 12

క. తలిదండ్రుల విడనాడితిఁ
జెలులను ద్యజియించితిని, సుశీలుఁడ వగునీ
చెలిమిని నాసించితి న
న్నలమటఁ గగ్గంబుసేయ నగునే నీకున్. 13

చ. తుదయు మొదల్ గనుంగొనఁగఁ
దోఁచనియీచటులోగ్రభూమినిన్
వెదకుచు నెంతదాక యిటు
నేఁ జరియింతు, గజేంద్రగామినీ
మదన! వసంత సారసుకు
మారశరీర! వియోగదుర్వ్యథా
విదళితధీరమానసల
వేచుట లెక్కడిన్యాయ? మక్కటా! 14

క. అనివగచుచు నొకతెరువరి
యెనసిన మార్గప్రయాస మెడలఁగ నాచెం
తను బొల్చు చెట్లనీడకుఁ
జని కనుఁగొనె నచట నొక్కజలజాకరమున్. 15

క. కని తెరువరి యాకొలఁకునఁ
దనివోవఁగఁ శీతజలముఁ ద్రావి శ్రమం బె
ల్లనుదూలి, సేదఁ దేఱినఁ
దనలో నీకీర్తిఁ జొచ్చెఁ దలపోఁతలకున్. 16

ఉ. తేనియసోనయో? చెఱకుఁ
దేటరసాయనమో?సుధారసాం
భోనిధిసారమో? తుహిన
భూధరసంజనితాంబువారమో?
జా నగు గోస్తనీఫలర
సంబో? వియల్లహరీజలంబో? యా
రా! నలినాకరాంబుకణ
రాశిరుచుల్ బహుభంగు లెంచఁగన్. 17

ఉ. పాంథకుమారుఁ డిట్లు మృదు
వాక్యసుధారసపూర్తి మత్తపు
ష్పంధయచుంబితాంబురుహ
షండ మృణాళ మరాళపాళి సం
బంధముఁ బ్రస్తుతించి, యొక
మావిసమీపముఁ జేరి పద్మినీ
బాంధవు వేఁడి వెల్గులకుఁ
బాల్పడకుండఁగ నుండె నంతలోన్. 8

వలచిన సంగడీఁ డొకఁడు
వంచితలాంఛనుఁ డై త్యజింపఁగాఁ
దలరుచుఁ, దద్వియోగపరి
తాపభరాపహరార్థమొంటిఁ బె,
న్నలత వనంబుఁ యుడి
యాసలగాసిలు పాంథుఁజూచి శాం
తిలెననభానుఁ డప్డు లవ
దీధితి నొప్పెను బశ్చిమాద్రిపై. 19

బాలరసాలపల్లవని
భం బగుకాంతలయంఘ్రియుగ్మలా
క్షాలలితాంకరక్తిమ వి
కావికనవ్వి, రతాంతపూర్వతాం
బూలరసారుణాధరల
మోవినిగారవుఁగావిచాయలన్
మేలము లాఁడె వృద్ధనళి
నీరసదారుణకాంతు లయ్యెడన్. 20

ముకుళించెను నెత్తమ్ములు,
వికసించెను మొలికల్వవిరు లెల్లెడలన్
వికలతఁ గనియె రథాంగము
పకపక నగియెను జకోరపాళియు నంతన్. 21

చ. చెలఁగి కులాయకూలములఁ
జేరఁగఁబాఱె శకుంతసంతతుల్
కొలఁకులఁ దమ్మికొమ్మలను
గూడి వయాళి యొనర్చు చున్నతేం
ట్లల జడిలేచి వ్రాయెను జ
లాంజలులై జడదారు లెల్ల సో
నలకడ సాంధ్యకృత్యము లొ
నర్చిరి సాంధ పవిత్రగాత్రులై. 22

గీ. జగ మనెడుచిత్రనాటకశాలయందు
నస్తమితుఁడై నతరణియనంతరంబ
భరముసూచింపఁ దించునీలత్తెర యనంగ
నంధకారంబు దెసలందు నలముకొనియె. 23

ఉ. అంబరకంబుకంఠికచ
మందు ధరించిన కుందపుష్పబృం
దంబనఁ బద్మినీరమణి
నాయకుఁబాసి వియోగతాప భా
రంబునఁ గంఠమౌక్తిక వి
రాజితహారముఁ ద్రెంచి చల్లుము
త్తెంబు లనంగ మిల్కుమను
దీధితి నొప్పె ను తార లయ్యెడన్. 24

అత్తఱిఁ బాంధసూతియు, మ
హాటవిఁ గ్రమ్మినయంధకార మం
దెత్తెరువుఁ గనుంగొనక,
హెచ్చినశోకమహాబ్ధి మగ్నుఁడై
పొత్తున సంచరించు పెను
భూతములం గని భీతచిత్తుఁడై
తత్తర మొంది, పాఱి దవు
దావుల నిల్చి వచించె నిట్టులన్. 25

ఓవనవాస! త్రోవఁగన
నోపక యీనిశి దారిఁ దప్పితిన్
జేవతొలంగె, నెమ్మది కృ
శించికలంగెఁ, జెలంగె గాఢచిం
తావిధి, దిక్కుమాలి నడ
యాడెడు నాకు శరణ్య మేది? శో
కావహభారదైన్యమగుఁ
గాక, కటా! విధియిట్టులుండునే? 26

ఎంతనిశోకించెద? నిం
కెంతని విలపించెద? నిటు లెంతని మదిలోఁ
జింతించెదఁ? గృశియించెద
నెంతని యీదుఃఖవార్ధి నీఁదుదు నార్తిన్? 27

ఉ. ప్రాణము లెంత యొ! యెడఁ
బాయఁగఁజాలవు నాదు దేహమున్
బ్రాణసమానమైన సహ
వాసుని నెయ్యముఁ బాసి దైవని
ర్మాణవిధిన్ వెతల్ కని భ
రంపడి గాసిలు నామనంబు పా
షాణమొ? వజ్రమో? యెఱుఁగఁ
జాలను వ్రీలకయుండ నింతకున్. 28

చ. ఒడలు పతంగబింబకిర
ణోగ్రనితాంతదవానలంబునన్
బడి కడు డస్సె; దీర్ఘగమ
నశ్రమ వేసట లావహిల్లె, బి
ట్టడలఁగ నయ్యె; నియ్యడవి
యందున నెందును దిక్కుఁగాన కే
ర్పడియెను నాకు దైన్యమె శ
రణ్యముగాఁగ, ననుంగు నెచ్చెలీ! 29

ఉ. ఆరనికూరిమిన్ మనము
నందు వరించితి నేమనోహరా
కారుని వానిఁ బాసి, కడఁ
గానని దుఃఖముఁ గూర్చినావె! నేఁ

గోరినకోర్కె లెల్లఁదుది
గొంతెమకోరిక లయ్యెనే? కటా!
ఘోరవనాంతమందు వగఁ
గూరికృశింపఁగవ్రాసితే? విధీ? 30

ఉ. పాడియటయ్య! నెయ్యు నెడఁ
బాపి మహాటవిలోన నిట్టుల
ల్లాడు మటంచు వ్రాయ, నద
యాత్మ! పిశాచివే? యాడుఁదోడునన్
గూడి జనింపవే? పగలు
గూరుపనాయమె, తోడునీడఁగాఁ
గూడి చరించుజంటలకు
ఘోరముగా నిటు పాపపున్ విధీ! 31

చ. చూడఁగదోయి? నన్నుఁ బటు
శోకరసాంబుధి మున్గకుండ నా
జాడకు రాఁగదోయి? కడుఁ
జయ్యన నెయ్య మెలర్పఁ బ్రీతిమా
టాడఁగదోయి? నీయడవి
యందు మహాపదఁ జెందకుండఁ గా
పాడఁగదోయి? నెచ్చెలి! య
పారకృపారతచిత్తవృత్తివై. 32

గీ. ఆటవికులార! నాయన్నలార! వినరె
బాటఁ దప్పితి నే నొక్క పాంథసుతుఁడ,
నడవి నడయాడి, బడలితి నడలె నొడలు
నన్ను రక్షింపరయ్య! యీనడిమి రేయి. 33

గీ. ఓదయాశీలురార! యోయోగులార!
యోతపోధనులార! యోపూతచరితు
లార! యోఘనులార! యోధీరులార!
వేఁడెదను మిమ్ము, నన్ను గాపాడరయ్య. 34

గీ. ఓసుగుణశాలులార! నే నొక్క పాంథ
బాలుఁడను, కాలవశమున బాటఁదప్పి
తిరిగితిమ్మరి వేసట నుఱలి దఱలి
దిక్కుమాలినకతనఁ బ్రార్థింతు మిమ్ము. 35

గీ. అక్కటా! యొంటిఁ జిక్కి నట్టడవియందు
వెతలఁ గృశియించునొకపాంథసుతుని కింత
సాయ మిడి యాదరించెడుసదయు లెవరు?
లేరె, యొకరైన నీవనాగారమందు? 36

చ. అనితలపోయుపాంథుబహు
ళార్తవిలాపము నాలకించి, చెం
తనె నివసించు చుండు నొక
తాపసి నెమ్మది నీఱుగాఁగ ని

ట్లినియె, కుమారా! యూరకె భ
యంపడఁబోకుము, రాత్రివేళ ని
ర్జన మగునీవనస్థలప్ర
చార మపాయ మటంచు నెంచవ్రా? 37

ఉ. ఈనిశియందు నిందుఁ జరి
యించెడు దయ్యపుమూఁకఁ గాంచి లో
దీనతఁ జెందఁబోకుము! ధృ
తిన్ వహియింపు, మధైర్యవర్తనన్
మానుము, చిక్కఁబట్టుము స
మస్తసుఖావహమౌవివేకమున్
బూనిక డాయవచ్చు, వెను
భూతములన్ బెడఁద్రోలు మెంతయున్. 38

ఉ. రాతిరి యొంటిపాటున న
రణ్యమునన్ దరిఁగాన నంచు దుః
ఖాతిశయాబ్ధి మున్గి బహు
ళార్తిఁ గృశింపకు మయ్య! జేలవై
భీతి వహించి కుందఁ దగ
వే? సహజంబులు గావె కష్టముల్
భూతలమందుఁ బ్రాణులకు
భూరిసుఖంబుల యట్లె బాలకా! 39

ఉ. ఈవనసీమలోన నిర
వేదియు లేదని ధైర్యమేది శో
కావిలచిత్తతన్ వెతల
నందకు, మార్గముఁ దప్పి, యుండఁగాఁ
దావులు లేని పాంథులకు
దగ్గర నొప్పెడుసాధునైన నా
తీవెల చిన్నియిల్లు చను
దేరుము ప్రీతి వసింప నయ్యెడిన్. 40

ఉ. కావున నోకుమార! దరిఁ
గాన నటంచుఁ గృశింపఁ బోకు, దీ
నావనుఁడై పరాత్పరుఁ డ
నారతమున్ వెతలొందువారలన్
గావఁగ నుండ నీకు భయ
కారణ మేటికి? నన్నుడాసి నా
దీవన లంది, నాయొసఁగు
తీయనిపండ్లు భుజింపు మీనిశిన్. 41

ఉ. సందియ మొందఁబోకుము ని
శాచరుఁడైన పిసాచి నంచు నీ
యందలి పుత్రవత్సలత నాదర
మొప్పఁగఁ బిల్చువాఁడ శ్రీ

ఉ. భూతదయాపరక్తు పరి
భూతప్రశాంతమనఃప్రవృత్తి, నీ
రీతి వసింతు, తాపసవ
రేణ్యులపోలిక, జీవకోటి యం
దేతఱి నైనభేదము నొ
కింత గణింపక, నిచ్చలున్ మృగ,
వ్రాతముతోడఁ గూడి యెడఁ
బాయనిచెల్మి వసింతు నియ్యెడన్. 45

క. చెలిమిని జెంతఁ జరించెడు
చిలుకల కోవెలలపొత్తు చిత్త మెలర్పన్
గలసి సతంబును బసిబి
డ్డల గతిఁ జరియించు లేళ్ళ లాలింపు దిటన్. 46

చ. అని తనుబిల్చు సంయమిశ
శాంకుని సారకృపార్ద్రవాక్యముల్
విని, హృదయాంబుజాతమున
భీతియు లజ్జయు నొక్క పెట్టునన్
బెనఁగొన మిన్నకుండె, నతి
విస్మితుఁడై పథికుండు ముందునున్
వెనుకకుఁ బోవు నుయ్యేలన
వింతగఁ జిత్తము తత్తరింపఁగన్. 47

ఉ. ఇవ్విపినాంతరంబున వ
సించుచు నా కభయం బొసంగు వీ
వెవ్వఁడొ! యేమి సేయ మది
నెంచిన వాఁడొ! యెఱుంగఁ జాలఁ దా!
నెవ్విధి వ్రాసినాఁడొ విధి,
యెయ్యదియో గతి,! యెట్టికష్టముల్
నివ్వటిలంగ నున్నవొ! వ
సిష్ఠలినంచుఁ దలంచుఁ బాంథుఁడున్ 48

ఉ. పోవఁ గడంగు ముందునకుఁ
బోవఁగ నీయదు సంశయంబు, „నన్
బ్రోవఁగ లేడె యిన్ని జగ
ముల్ భరియించెడు దైవ" మంచుఁ దా
భావమునం దలంచు, „యతి
పాదములం బడి సత్కృపారతిన్,
గాపు మటంచు వేఁడెదను
గాక" యటంచును నెంచుఁ బాంథుఁడున్. 49

ఉ. ఎయ్యదియుక్తమో, మఱి యుఁ
కెయ్యది యుక్తముఁగాదొ, సంగతం
బెయ్యదియో, యసంగతము
నెయ్యదియో యని సంశయంబునం

మయ్యెల లూగుచుండె నిలు
పోపక పాంథుని చిత్త మప్డు సం
దియ్యమ ధీవిధానము లో
కింత నెఱుంగు తెఱంగు కెయ్యెడన్. 50

ఉ. “ఏపోయెదఁ గాక మానివరు
ముంగిటఁ గంచుఁ గడంగు “నొంటిని
రేయిని లాతిపూరుషు
దక్షిణ వసియింపగ భావ్య మౌనె నా
కీయటవీ ప్రదేశమున నే
టికి స్థితి దాపరించె పో
నాయెనె యింత కైన మొద
లారి మకీయవిపచ్చయం”బనున్. 51

క. ఊపగిదిఁ గొంత సేపటు
నాపాంథుఁడు సందియమున నటు నిటుఁ జనకే
ప్రాపుఁగన కెట్టకేలకు
నాపదమునుండు పాలి కటఁగొఁ గడంకన్. 52

క. దరి సెను బ్రాహ్మ్యమున ని
ద్దుర వదలుండు, మేలుకొనుండు, తొలగెను నిశియుం
చరసి మొఱఁగించెనో యన
మొరసెను కుక్కుటనినాద ములు దిశలందున్. 53

చ. తోలఁగె రథాంగదంపతుల
దుస్సహగాఢవియోగవేదనల్
చెలఁగె దిశాంతమందుఁ
దరళీకృతధ్వాంతధళాచ్ఛసూచనల్
కలఁగెఁ దమఃప్రభావములు
కాలవికారవిధాయకంబులై
మలఁగె సుగంధబంధురస
మందకుమారసమీరవారముల్. 54

ఉ. తెలతెల వాఱు చుండెనని
తెల్పెడి చాయ శుకీపికావళుల్
కలకల మొచుఁ గూసెఁ బొద
లన్ నిదురించిన తేళ్ళు లేచి వి
చ్చలవిడి లేఁతపచ్చికల
చాయల కేగె, సమస్తజీవముల్
తెలివి వహించె దుస్తమస
దీధితు లెల్లెడలన్ గ్రహింపఁగన్. 55

క. చలువల రేని గవుంగిట
మెలఁగుచు నిసినెల్ల సురతమిళితశ్రమయై
యలసి నిదురించెనాఁ గనుఁ
గొలఁకుల నెఱమోప్పు నించెఁ గుముదిని యంతన్. 56

క. సలలితపత్త్రంబులపై
నలరెడునీహారబిందు లటఁ దలపించన్
జలితఘుసుఁజెక్కుళులఁబయి
విలసిలునూత్నశ్రమాంబువితతులు వ్రాలెన్. 57

చ. చిదచిద లాడు తేనియలఁ
జిప్పిలు కమ్మని యిప్పపువ్వులన్
గదసి తదాసవంబుఁ దమిఁ
గానకఁ ద్రావి, హసించి, క్రైపునన్
జూదలి శరీరముల్ మఱచి,
ఘోర్ఘురు పోఁక లెఱుంగ లేక స
మ్మదమునఁ ద్రిమ్మరెన్ గడఁగి
మాధుకరీవ్రజ మవ్వు డవ్వనిన్. 58

ఉ. తెల్లనిజాజిమల్లెనునుఁ
దీవెల నల్లెడ నల్లిబిల్లిగా
నల్లిన పూవుపందిళుల
యందున మంచమరందబిందువుల్
జల్లున రాల తుమ్మెదకొ
లంబు పరుంగిడ సాఁగె నాసతో
నల్లన విచ్చు పద్మముకు
శాంతరతల్పములోలి వీడుచున్. 59

. నూతనకేతకీదళమ
నోహరకుట్మలగర్భితాంకురం
బాతతి విచ్చుచుండుట త
దాగమసౌరభ సారసంగ్రహా
యాతకిశోరగంధవహ
మారడివెట్టఁగ మోసలెత్తు నా
శాతతిఁబోవఁ జూచు నళి
సంతతు లెంతయు వింతవింతగన్. 60

. అంతటఁ గనంగ నయ్యె నుష్ణాంశుబాల
కిరణతరుణాతపంబులు కింశుకప్ర
వాళకాంతుల నిరసించి ప్రాగ్దిశాకృ
శోదరీపాణిపల్లవ శోభ లనఁగ. 61

చ. ఆసమయంబునందుఁ గను
లారఁ గనుంగొనెఁ బాంథసూతి ద
ర్భాసనదండకాండ భర
ణాభరణున్ నవమన్మథాంగునిన్
భాసురమంగళాస్యు నెం
ప్రియపుఁ జిన్నెల వాని నూత్నన
వ్యాసపరిగ్రహాంకురస
మాదరణీయుని సాధుగేయునిన్ 62

క. కనుఁగొని నెమ్మది సంశయ
మును విస్మయమును జనింప మునివరు చాయన్
దనివి సనఁ జూచిచూచి, య
వనతముఖుఁ డయి తలపోసె భావము నందున్. 63

ఉ. ప్రాయము లేఁతజవ్వనము,
భావభవున్ దులకించు రూపమున్,
గాయము పుష్పకోమలని
కాయము, రాజితసౌకుమార్యసం
ధాయకుఁ డైనసీయతివి
ధానము దెంతయుఁ జోద్య మయ్యెనం
చాయెడ బాటసారి హృద
యాంతరమందుఁ దలంచు చుండఁగన్. 64

చ. తనదరిఁ జేర భీతిలుచు
దవ్వుల నిల్చిన పాంథబాలునిన్
గనుఁగొని, సాదరంబునఁ బ్రి
కాశితహాసవికాసుఁడౌచు నా
మునివరుఁ డిట్లు పల్కె వగఁ
బొందకు, కుందఁగ నేల? నీకు నా
య ఘుఁడు సంశ్రితావనుఁ డ
నంతుఁ డతీంద్రియుఁ డుండ నారయన్.

ఏచినసంశయాములవి
హీనమనోభినివేశవృత్తిఁ గా
లోచితకార్యముల్ సలుప
పోయి కుమారక! యిందువచ్చి స్వా
నాచరణాది సత్క్రతుచ
యంబు లొనర్చెద నేనుబోయి సం
కోచము నందబోకు సమ
కూడును నీదు మనోరథంబులున్. 66

అని పాంథుని కథయం బిడి,
జని నాయతిపుంగవుఁడు సమయాతురుఁడై
మొనసినవిస్మయమున ని
ర్జనమగుపొదరింట బాటసారి వసింపన్. 67

పర్ణశాలను నిలచిన బాటసారి
మౌని రూపంబునకు ననుమాన మొందు
సాధువర్తన దలఁచి విస్మయముఁ జెందు
నిముసమున కొక్క గతి మతి నిశ్చయించు. 68

చిగురాకుఁ దొగమేసి పొగరెక్కి వగదక్కి
కిలకిలఁ గూయుకోయిలలనరయుఁ
బలుమేలి ఫలజాలములమెక్కి తరులెక్కి
పకపక నవ్వుశారికలఁ జూచు

మధురగీతంబుల మధుబిందువులుజిల్కఁ
గలకలఁ బాడు చిల్క లనుగాంచు
నటీపూర్వ మదుల నునడబెడం గదరంగ
ప్రమదం బిడుకొదమ నెమళులఁగను
గీ. గాంతశశికాంత సోపానకలితదళిత
సారసరసాంతరవిహారసమదరాజ
హంసహంసీమృదుస్వన మాలకించు
హర్ష మొదవించుఁ దద్వనాభ్యంతరమున 69
సీ. జడదారిరాయ లెల్లెడ దేవపూజకై
కోసిన దర్భలఁ గొఱుకునవియు
సగముమేసిన కుశాంచలము లల్లన రాలఁ
బచ్చని బయళులఁ బాఱునవియు,
దుగ్ధంబులాను లేఁదూడమై నాకుచు,
దిక్కు లీక్షించుచుఁ దిరుగు నవియు
నణుమాత్ర శబ్దంబు నాలించి జడిసి యం
తట చంగు చంగున దాటునవియు
గీ. జంట లెడఁబాయఁ జాలక సహజప్రకృతి
భవపరస్పరస్నేహంబు బయలు పడఁగఁ
గలసి చరియించునాకురంగములపొత్తుఁ
గనులతమిఁదీర పాంథుఁడు గాంచుచుండె. 70

ఇంతలోఁ గాల్యకృత్యము లెల్లఁదీర్చి
మరలిచనుదెంచె నామౌని వర్యుఁ డు కంద
మూలఫలములుగొన్ని చేఁబూని యల్ల
పాంథకుమరునియలసటఁ బాపనెంచి. 71

నిశఁ గృశించినయాపాంథుఁగుశల మడిగి,
యతని హృద్గతశోకసూచితనితాంత
ముఖవిలాసంబుఁ గనుఁగొని మునిశశాంకుఁ
డెదను గనికర మిగు రెత్త నిట్టు లనియె. 72

ఓయికుమారపాంథ! తగ
వ్యో? వగఁగూరి కృశింప నింత లేఁ
బ్రాయపుచిన్నవాఁడవు; దు
రాసదమైనవనీవిహారమున్
జేయఁగసాహసింప నగునే?
తలిదండ్రులవీఁడి యొంటిరా
న్యాయమె? నెయ్యులైన యుచి
తానుచితంబు లెఱుంగఁ బల్కరో! 73

నీసుకుమారరూపరమ
ణీయతఁగాంచిన, సాహసంబునన్
జేసిన కార్యమెంచిన, జ
నించెడు నద్భుతవిస్మయంబు; లు

ల్లాసము నేది దుఃఖవిధు
లనఁగనె దంచుఁ దదీయ చిహ్నానం
వాసిత మైననీముఖవి
భావము చెప్పక చెప్పెడుఁగా సుమీ! 74

ఉ. కలసి మెలంగుచున్న చెలి
కాం డెవ్వ రైనను నీఁడ నాఁడిరో!
యలసి వియోగదుఃఖముల
నానఁగ నెవ్వతె యైనకామినీ
తిలకము మోసగించెనో! x
తించిరో నీతలిఁదండ్రు? లిల్లువా
కిలి హరియించి దాయలు స
కిల్బిషు లైవని కేగఁబంపిరో! 75

గీ. చెలిమియనఁ „వేరె"సుమ్మి! కేవలముమాయ,
ఛాయ వడువున ధనికులఁబాయ కుండు
దుర్భ్రమనుదార్చి, వలపునిద్దురకులాగు
లాలిపాటవిధంబున జోలఁబుచ్చి. 76

చ. తెలియఁగఁజాల నీవిధముఁ
దెల్లముగా వినుపింపుమయ్య! నీ
కలితవిషాదసంగతికిఁ
గారణమెయ్యదో చింత లెవ్వియో

తెలియక నిత్యసంతసవిధిన్
జరియింపఁగనైన ప్రాయమం
దలఘువియోగవృత్తి నడ
యాడెదురాఁగ విరక్తుఁడో యనన్. 77

పాటవమెల్ల సన్నగిలఁ
బ్రాయపుఁగాయము పెక్కుబాములన్
గాటపుముప్పుఁ గాంచ, దరిఁ
గానక సర్వముఁరోసి, వేసటన్
గాటికిఁగాళ్ళు సాచుసుఖ
గర్వితజీవను బోలె, నిట్టులీ
వేటికి లోకసంసరణ
మెల్లను వీడితివోయి? పుత్రికా! 78

సారసంసారసౌఖ్యముల్ చూఱవిడచి
యడవుల వసింపఁ గలదె యేవంత ఫలము?
పిన్ననాటసుఖంబులు విడువ నగునె?
సర్వసంగపరిత్యాగశాలి వోలె. 79

ముతదనంబునందె వన
సీమల కేఁగుమటంచు నెవ్వరేఁ
వెన రా? క నీకె కుతు
కం బుదయించెనె కానకేఁగ? నా

తురమతి నొంటిఁబోవఁ బెడ
త్రోవలఁబట్టెనె నీదుబుద్ధి? యే
వెఱవున వచ్చితోయి? యట
పీస్థలికిన్ భయ మేదిబాలకా! 80

ఉ. వాడినమల్లెతీవెగతి
భాసిలు నీదుతనూవిలాసమున్
జూడగ జాలిపుట్టెడుప్ర;
సూనవినూతనమార్దవంబు నూ
టాడెడునీదుసోయగము
నా యయనచ్చెరువయ్యె నింక మా
మోడకనీ ‘థఁ దెలుపు
మోయి? కుమారక! సత్వరంబుగన్.

ఉ. ఏయమగర్భ మందు జని
యించితి నోములపంటగాగ? నీ
కేయదిమాతృభూమి కల
మెయ్యది యెయ్యదికార్యమయ్య? ముం
దేయెడ కేగ దోయి? వచి
యింపుము నీదు తెఱంగు నంతయున్
నీయెడస్నేహభావము జ
నించుటఁ బల్కితినుమ్మి! యీగతిన్. 82

... సహచరులఁ బాసి, యొంటి స్వస్థలము వీడి,
దూరభూములఁ దిరుగు కిశోరహరిణి
కరణి, నీదుర్గమస్థలిఁ గలయఁద్రిమ్మ
రెదవు, బాలకా! యెచటి కేగెదవు? చెపుమ? 83

క. నలిగిననలినము గతి శో
భలు దూలి హసించునీదువదనము, కడునాఁ
కలిడప్పుల సోలెను, బి
ట్టలసితి విందందుఁ దిరిగి యడవులలోనన్. 84

క. కావున నీచరితంబును
వే వివరింపుము, మదీయవిస్మయశంకా
భావితభావము సుస్థితి
నీవెఱపును బాపఁ గలదు నెయ్యమున సఖా! 85

చ. అనితుహినాంబుశీతలస
మార్ద్రవచోవిధిఁ బల్కరించు నా
మునివరుశాంతసూక్తులను
ముచ్చటఁ దీరఁగ నాలకించి వం
చినమొగ మెత్తఁ డయ్యెఁ గుల
లవయోవిభవానురాగముల్
వెనఁగొన నిల్చు ముగ్ధలవ
లీసుకుమారి యనంగఁ బాంథుఁడున్. 8

గీ. దారిఁ దప్పినయాపాంథతనయు నచట
ముని సుధామయోక్తులు గాని ముదము నింపు
సమదశుకపికమధురనాదములు గాని
యనునయింపంగ లేవయ్యె నపు డొకింత. 87

ఉ. భ్రాంతి మొగంబు వాంచి యని
వారితభారవిషాదవేదనా
క్రాంతమనస్కుఁడై సొగసుఁ
గన్నుల నశ్రుజలంబు లూర నా
వంతయు నూరడిల్లక మ
హావిపదబ్ధినిమగ్నుఁ డైన శో
కాంతుఁడు వ్రాలె నాయడవి
య్యందునదుఃఖలసాఁగెఁ బాంథుఁడున్

గీ. సాంద్రచంద్రోత్సవంబునఁ జంద్రకాంత
మణుల వెడలెడు విమలాంబుకణము లట్టులఁ
బాంథకుమరుని కనుఁగొనపజ్జవదలి
పారిఁబోతిం బాష్పబిందువు లురలఁదొడఁగె. 9

క. అదిగని యతివరుఁడును నె
మ్మది నెయ్యముకొనలుసాఁగ మధుమధురోక్తిన్
విదళితధైర్య్య విషాదా
ర్తుదుఁ బాంథుఁబ్రసన్నుఁ జేయసమకట్టియనున్

ఉ. కన్నులనీరు కాలువలు
గట్టఁగఁగట్టడిఘాతబన్నముల్
పన్నె నటంచు లోవగవఁ
బాడియటయ్య సుఖంబుఁగష్టమున్
వెన్నెలచీకటుల్ బలెనె
వీడక నొక్కటి వెన్క నొక్కటై
క్రన్నన వచ్చుచుండు వగఁ
గాంచఁగ నానాకో! యింతమాత్రకున్. 91

చ. ధరణిగతాంతరాచరిత
దారుణకర్మఫలంబులూరకే
విరమిలునొక్కొ, తారనుభ
వింపక యెప్పుడో! యేవిధానమో!
తరమొకో కర్మబద్ధుఁడయి
ధారుణి ద్రిమ్మరు వికిన్ నిరం
తరము సుఖింప లేక సత
తంబునుగష్టముఁజెంద బాలకా 92

.. కలిమియును, లేమియును, [illegible]కాల ముండఁ
బోవునవి గావు, వానికై ప[illegible]ఁబోకు
కాలకర్మవిపాకముల్ గడపఁదరమె?
కడచి బ్రదిన వారలుగలరెపుడమి?

మ. అని శాంతోక్తుల నూరడించు మునివా
క్యశ్రేణి నాలింపుచున్
గనులన్ బుట్టి కపోలముల్ తడుపు నా
కన్నీరు మున్నీరుగా
నెనయన్ బయ్యెట నద్దుచుండెఁ బథికుం
డెవ్వారి కేనిన్ మనో
భినివేశంబులు దాచనౌనె ప్రకృతా
విర్భూతి భేదించినన్ 94

క. కనుఁగవ కావిఁ గొనంగను
వనటన్ గృశియించి దరలుపాంథుండును నా
య్యన నెట్టకేల కాముని
యనుపమవాక్యోపశమితసార్తుండగుచున్ 95

క. తనకథ నంతయు నీవిధి
వినిపింపఁ దొడంగె బహుళవిస్మయహర్షా
వనుఁడై యతితల్లజుఁడును
మనమున నలరంగ మందమందమృదూక్తిన్ 96

ఉ. ఓయనఘావతంస! దయ
యుంచి ననుంగరుణింపుమయ్య! నేఁ
జేయఁగరానికార్యమును
జేసితి నంచును దూరకయ్య! లేఁ

బాల్యమునందె దుఃఖసరి
భాగుఁడనై కడలేనిముప్పులన్
మోయఁగ నోచియుంటిఁ దర
మా గణియింపఁగఁ గర్మదుర్విధుల్. 97

క. పాపముఁగట్టుకొంటి, నొక
పాంథకుమారుఁడ నంచుఁ జెప్పి, నీ
ప్రాపును జేరి, సంతతత
సత్ప్రతిభాపరిపూర్ణమైన నీ
పూఁబొదరింటిలో నడుగు
మోపి కటా! విధినేమనందు నా
పాపము పండె, నింకఁ బరిపా
కముగల్గునె యెన్నఁడేనియున్? 98

చ. శరణము లేమి, దైవగతి
చాలమి, నామది యాస లెల్ల ని
క్కరణిని నిష్ఫలంబు లయి
గాలికి బోవఁగ దిక్కుమాలి, దు
ర్భరతరదుర్వియోగముల
పాలయి, గాసిలుచుంటి నయ్యా! నీ
వెటిఁగిన నేమి యింతదుర
దృష్టగతం బిదియే సుమీ! భువిన్. 99

గీ. దాచ నేటికి నింక నో తాపసేంద్ర!
పాంథుఁడనుగాను నేనొక్క పడఁతినయ్య!
వెతలఁ గృశియింతు పై వ్రాపహతి వియోగ
భారశీలనై దౌర్భాగ్యవశతఁ దవిలి. 100

కం. కోఱినోముల నోఁచితిఁ ద
ద్దురితఫలంబుగ వియోగదుస్సహదుఃఖా
తురనై యిటుఁ బలవించెదఁ
దరిఁ గానక దుర్వ్యథావిదారితమతినై. 101

ఉ. జననము రాకొలంబున, వి
శాలయశోవిభవుండు, వంశపా
వనచరితాంకుఁడల్ల జయ
పాలుఁడు నాజనకుండు నన్నునే
యనుపమభాగ్యశాలి కడు
పారఁగఁగాంచెనో నేనెఱుంగ, నే
మని వచియింతు నయ్య! వెత
లైమె కోఱమాలిననాచరిత్రముఁ. 02

ఉ. అడిగిన వెల్లఁ జేకురఁగ
నాటలఁబాటల శైశవంబునన్
గడపితి, ముద్దుముచ్చటలు
గారవ మొప్పఁగఁదండ్రి, రె, పెం

పడరఁగ నామనోరథము
లన్నియుఁదీవెలుసాఁగసాఁగ నే
ర్పడియెను జవ్వనంబును స్వ
భావశుభప్రతిచిహ్నమోయనన్. 1

చ. తనువున యౌవనాంకురవి
తానము పుష్పితమైనదాది మో
హనసుకుమారమారలలి
తాంగుని, సౌరదయాంతరంగునిన్
వినుతచరిత్రసంగుని, వి
వేకపవిత్రకళానుషంగునిన్
మనమునఁగోరితొక్కని, స
మానవయస్కునిఁ సత్యవర్ధనున్. 104

ఉ. కోరినదాది సూనశరు
కోలలజేయములై యహర్నిశం
బూరక నన్నలంప, మన
మూరటఁజెందక నొక్కభంగి సం
చారముఁజేయసాఁగెఁ బలు
చాయలఁ, జిత్తనిగూఢవృత్తుల
జ్జారతి సంభవించె సహ
జప్రతిభూతఫలంబుకై వడిన్. 10

గీ. అంత నాకరగ్రహణంబు నభిలషించి,
రాకుమారులు పలువురు రాఁగడంగి
రెన్నియో కైతవంబుల నన్నుఁగన్న
యయ్య కడ కంత ననుఁబెండ్లియాఁడ నెంచి. 106

గీ. కాని యాపెండ్లికొడుకుల లోన నొకని
యందయిన నాదుమది నిల్వదాయె, హృదయ
వాంఛితుండైన నాదయాలాంఛనునికి
నర్పితంబౌట నట్టుల నౌనుగాదె? 107

ఉ. నాహృదయేశ్వరుండు, కరు
ణాభరణాభరణుండు, ప్రాణను
స్నేహవరవ్రతుండు, కుల
శీలవయోవిభవుండు, జ్ఞానసం
దోహసమంచితుండు, సుమ
నోజ్ఞకలాకలితుండు, నాపయిన్
సాహసమూని యీవెతల
నన్ గృశియింపఁగఁద్రోసె సంయమీ! 08

గీ. మేలిగానములె యాతనిపాలిసొమ్ము
లతులవిద్యాప్రవీణత యతనిధనము,
భూతదయయును, సత్యంబు పుట్టినపుడె
యలవడియె, లేదు వేఱొకండతనికిలను. 109

అనురాగవివశ నయి యి
ట్లనయము నావన్నెకానియందునఁ జిత్తం
బును నిల్పి భరాలసనై
వనరి తొకానోకవికారవశసంభ్రమనై . 1 0

క. నిముసములు దినంబులయి, ది
నములుయుగములయి జరుగ మన మడలుచు వియో
గమున మునింగె, మనోరథ
సమధికతౌన్నత్య మెడల సాఁగెఁగడంకన్. 111

గీ కుసుమితనవీనయౌవ నోల్లసిత దేహు
నాహృదయచోరు కేలంద నూహఁ సి
సదయహృదయాభిలాషలఁ గుదురుపఱచి
వనరుచుంటి నిశాంతపద్మినియుఁ బోలె. 112

గీ. హిమవ దవసానమునఁ జెలువెనయ నున్న
మారుతాగమ మీక్షించు మల్లికగతిఁ
గొసరియువ్విళు లూరుమానసమెసంగఁ
దటినిరీక్షించుచుంటిఁ దత్ఫలముకొఱకు. 13

గీ. నొసలివ్రాతయొ! లేక నానోముఫలమొ!
గాని చేకుఱదయ్యె, నాకాంతురూపుఁ
గనులపండువుగాఁ గని యనునయోక్తిఁ
బలుకరించెడుమాత్రంపుభాగ్యమైన. 114

గీ. సిగ్గుపెంపునఁ దష్ట్రికిఁ జెప్పనైతిఁ
జెలుల కెఱిగింపనైతి నెందులనో గాని
లోనియాసలు లోలోనె నానసాఁగె
నటఁ బరస్పరస్నేహదోహదము లేమి. 15

చ. కొలచిన వంశదేవతలు
కోరినకోరికలీయరాయె, నేఁ
దలచిన దారులెల్లను వృ
థావ్యథలై విరమించె నెమ్మదిన్
మొలచిననాసలెల్లఁ జిఱు
మోసల నెత్తక యస్తమించె, నన్
వలచిన వన్నెలాడునువ
నాటులకేఁగె నిఁకేమి చెప్పుదున్. 16

ఉ. పూచినపూవువంటి వల
పుం బచరించెడు లేతజవ్వనం
బా చటులోగ్రదుర్గమమ
హాటవిలోపలఁ బండువెన్నెలల్
కాచినయట్లొనర్చి, కడఁ
గాననిశోకమహాబ్ధిలోన నన్
ద్రోచి, తొలంగెసంసరణ
దూరగుఁడై వితసోలి యాతఁడున్ 17

„అందనికల్పవృక్షఫల
మయ్యది యాసవహించె దేటికో
డెందమ! వల్దు" టంచు మర
లింపఁగఁజూచితిఁగాని,యాకళా
నందునిపేఁడదయ్యెను మ
నంబకటా; కడుమందభాగ్యురా
లం దయివాఱునోక్కొ—! సఫ
లంబుగ నాదుమనోరథంబిలన్.

ఉ. ఆననమోహనుండు, సుగు
ణాంచితశీలుఁడు, సత వర్ధనుం
డానఁగరాని మోహవివ
శాలసుఁడై, యనురాగమెంతయో
మానక నాపయిన్‌నిలిపి,
మాపఁగరానివియోగదుఃతిన్
నేనోడఁ గూడనంచుఁగృత
నిశ్చయుఁడై వనికేగె సంయమీ! 119

చ. పలుకులనైనఁగాని పొలు
బాటునవైననుఁగాని నర్మవా
క్చలనమునైనఁగాని, సుము
ఖస్మితహృద్గతభ్రాంతిఁగాని నేఁ

దెలుపఁగనైతి నావలపుఁ
దీపిని దెల్లముగా నొకప్పుడున్
జెలిరతనాలకైన నెడ
సేయక నా వెనువెంట నుండినన్. 120

క. అట్లగుట నాదుకోరికెలన్న్యు లెవరు
నెఱుఁగఁజాలరైరి, వియోగభరితనౌటఁ
దరలుచుంటిని నేనుమాత్రమె, మనోవ్య
థలకుమందులుగలవె యీధాత్రినెందు. 121

గీ. తానొకటిదల్ప దైవంబు దలఁచునొకటి
యనెడు లోకోక్తి సత్యమయ్యెను మునీంద్ర!
దిక్కుమాలిన నాబోటితెఱవ బ్రతికి
యేమి, భూతలంబున లేక యేమి? యనఘ! 22

ఉ. మించినకోర్కులెల్లనుశ
మించె, వరించిననెయ్యుడున్ విస
ర్జించె, మనోజవంబులు కృ
శించె, వియోగవిషాదముల్ విజృం
భించె, నితాంతదైన్యముర
మించె, జనించెనపారశోక, మా
సించెభరమ్ము, నింకఁగడ
చెయ్యి మదొక్కటె నిల్చెసంయమీ! 1

రాకొలమందుఁబుట్టి, యను
రాగమునొక్కని యందునిల్పి, య
స్తోకవిధిప్రయుక్తి వితసో
లుచుఁ, బూరుష వేషధారిణై
నీకుటజంబుఁ జేరి, యతి
నిర్మలమై, సుపవిత్రమై, తపః
ప్రాకటమైననీసుకృత
భావమువాపితనైపు మోముని! 124

వలపును దలఁపును నాపయి
నిలిపి వియోగగతి కడలి నిశ్చలమతియై
తలఁచుచు నిందెందోయ
య్యలఘుఁడు మరణించి యుండునయ్య మహాత్మా 25

కానవాప్రాణసముని యనూనసదను
రాగమునకు మారుగ నాదు ప్రాణములను
ధారవోయుదు సమ్మోదపూరణముగ
మ్రొక్కెదను నాకు సెలవిమ్ము మునివరేణ్య!
అనిపరాఙ్ముఖియైన నవ్వనిత వచన
రచనముగియకుండఁగనె, హర్ష వివశుఁడయి
పాంథవేషధారిణియగు పడఁతినచట,
రాగమతియయినాయతి కౌగలించె,

ఉ. అంతట నాశుభాంగిహృద
యంబుభయంబునఁ దల్లడిల్ల, వి
భ్రాంతమతిన్ జలీకృతకు
రంగియుఁ బోలెనమీపభూరుహ
ప్రాంతము మాటుకేగి హృద
యావహరోమకపాయదీధితుల్
కాంతనవారుణాధరము
కాంతులఁబంతము లాడనిట్లనెన్,. 12

చ. వనులవసించుచుంటి, నతి
భక్తిఁదపం బొనరించుచుంటి, సా
ధుని తవృత్తినుంటిఁ, బెడ
త్రోవలఁబోవక కాయగూరలన్
దినిమనుచుంటి నంటి, కల
దే! యవివేక మఁటంతకన్న, క
న్యానిదలంపకిట్టుల ప
రాంగనపైఁబడఁ జూడదుర్త ! 12

యి కుహనాయతీంద్ర! యిట్లొప్పునయ్యా
అబలయొక్కతె యొంటిగా నబె ననుచుఁ
దలఁపరానియకార్యంబు సలుప నెంచఁ
దగునె? కాల్చనే నీజప తపములెల్ల?